రహ్మనుద్దీన్. షేక్

# పిల్లల
# జానపదపాటలు

సేకరణ

## కప్పగంతుల మురళీకృష్ణ




గంగాధర పబ్లికేషన్స్
రామమందిరం వీధి
విజయవాడ-520002

# ఒక్క మాట

సహజంగా పిల్లలకు అక్షరాభ్యాసం ఐదవఏట, తప్పని సరి పరిస్థితిలో ఏడవ ఏట చేస్తుంటారు. కె. జీ. చదువులు వచ్చాక మూడవ ఏటనే విద్య ప్రారంభింపచేస్తున్నారు. ఇది చదువు విషయం.

అసలు పిల్లలకు విద్య తల్లి ఉగ్గుపాలతోనే రంగరించి నేర్పుతుంటుంది. సంజ్ఞలు, పాటలు, చేష్టలతో ఆమె పిల్లలను ఏమీ తెలియని స్థితిలోనుంచి మనుష్య లోకంలోకి తీసుకుని వస్తుంది. ఎవరికైనా తొలిగురువు తల్లే. అందుకే మన మహా రుషులు, 'మాతృ దేవోభవ' అని ఆ తర్వాతస్థానం తండ్రికి. 'పితృ దేవోభవ' అని ఊహవచ్చాక, విజ్ఞానం కోసం గురువు వద్ద చేర్పడం జరుగుతుంది. అందుకే 'ఆచార్య దేవోభవ' అని, పిల్లలు వృద్ధిలోకి వచ్చాక యిక మిగిలింది దేవుడే.

తల్లి ఇంకితాన్ని బట్టి పిల్లలు వృద్ధి చెందుతుంటారు. మంచి అలవాట్లు, నమ్రత, దయాగుణం, యివన్నీ చిన్నప్పటి నుండే రావాలి. ఇంటిని చూచి ఇల్లాలిని చూడమన్నట్లే పిల్లల నడవడి తల్లి సంస్కారాన్ని బట్టి వుంటుంది. అందుకే వెన్నతో బెట్టిన విద్య అంటారు.

మన పూర్వులు పిల్లలకోసం పిల్లల మనస్సుకు అర్థ మయ్యేరీతిలో ఎన్నో మహత్తరమైన పాటలు వ్రాసి తల్లుల నోట్లలో వాటిని భద్రపరచారు. ఈనాటికి ఏనాటికి తలమానిక మైన యీ పాటలు పిల్లల కోసం సేకరించి మీ ముందుంచు తున్నాను. ముఖ్యంగా ఇందులో చాలా పాటలు మా అమ్మ గారికి వచ్చినవే. ఆమె పాడుతుండేది. అయినా, పిల్లల పత్రికలు నుండి, కొత్తాంధ్రవాచకము, ఇంతా కృష్ణశ్రీ, బి.రామ రాజుగారి గ్రంథాలనుండి సేకరించి మీ ముందుంచుతున్నాను. ఆధునిక నాగరికత మన సంస్కృతిని, సభ్యతలను భంగ పరచినట్లే, మన అమూల్య సాహిత్యాన్ని కూడా మనం మరచి పోయేలా చేసింది.

ఇట్లు

కె. మురళీకృష్ణ

## పిల్లల
## జానపద పాటలు

తల్లి చనుబాలు తక్కువైనప్పుడు, ఉగ్గు గిన్నెతో పాలు పోస్తూ.



ఉ. ఊ. ఉంగన్న ఉగ్గుపాలిందన్న
గంటెడు ఉగ్గే కలవయ్యా.
చప్పున గప్పున మింగయ్యా

పాలు పట్టడం అయ్యాక అది జీర్ణం కావడానికి



జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రం తిన్న గుగ్గెళ్ళు జీర్ణం
ఏనుగుతిన్న వెలక్కాయ జీర్ణం
అబ్బాయి త్రాగిన ఉగ్గుపాలు జీర్ణం
నందిలాగ కూర్చొని, తాబేలులాగా, ప్రాకి,
లేడిలాగ లేచి కుందేలులాగా పరుగెత్తి

అంటుంది.

## పిల్లలను తల్లి ఒడిలో కూర్చోపెట్టుకుని ఆడించే పాట



తారంగం తారంగం తాండవ కృష్ణా తారంగం
వేణూనాద తారంగం వేంకట రమణా తారంగం
చిన్ని కృష్ణా తారంగం చిట్టి కృష్ణా తారంగం



అని-

ఏనుగు ఏనుగు నల్లానా, ఏనుగు కొమ్ములు తెల్లనా
(దంతాలు)

ఏనుగు మీది రాముడు ఎంతో చక్కని దేముడు.

ఏనుగొచ్చిందేనుగూ ఎవూరొచ్చిందేనుగూ

మావూరొచ్చిందేనుగూ మంచినీళ్ళుతాగిందేనుగూ

ఉప్పులూరొచ్చిందేనుగూ ఉప్పునీళ్ళు తాగిందేనుగూ

# పిల్లలను ఆడించడానికి



చందమామ రావె, జాబిల్లి రావె
కొండెక్కి రావె, గోగిపూలు తేవె
బండెక్కి రావె, బంతిపూలు తేవె
పల్లకిలో రావె, పారిజాతం తేవె
తేఱెక్కి రావె, తేనెపట్టు తేవె
ఆటలాడ రావె, అబ్బాయికిచ్చి పోవె

## పిల్లలు అమాయకులు వారికేమీ తెలియదు ఏం చెపితే అది, వింటూ చేస్తుంటారు



అన్నం బెట్టి, అప్పం బెట్టి
గారె బెట్టి బూరె పెట్టి
పాలు బోసి పరమాన్నం బెట్టి
అప్పడం బెట్టి దప్పడం బెట్టి
కూర బెట్టి నార బెట్టి
అరచేతిలో నెయ్యిపోసి అత్తవారింటికి తోవ

ఇదుగో అంటూ బాలుని చంకలోకి తీసుకువెళ్ళి చక్కలిగింతలు పెడితే బోసినోటితో పిల్లలు ఎంతో ఆనందంగా నవ్వుతుంటారు.



పాపాయి కన్నులు కలువ రేకుల్లు

పాపాయి జుల్పాలు పట్టుకుచ్చుళ్ళు

పాపాయి చెక్కిళ్ళు పసి వెన్నముద్దలు

పాపాయి పన్నెలు పసి నిమ్మపండులు

పాపాయి పలుకులు పంచదార చిల్కలు

పాపాయి చిన్నెలు బాలకృష్ణుని వన్నెలు



చేతిలో వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగారు మొలత్రాడు పట్టుదట్టి
సందిట తాయితల్ సరిమువ్వగజ్జెలు
చిన్నికృష్ణయ్య నిన్ను నే చేరి గొలుతు



వానా వానా వర్లప్పా వాకిలి తిరుగూ చెల్లప్పా

తిరిగి తిరిగి చెర్లప్పా, చినకాకానిచేరు చెల్లప్పా

# గణపతి ప్రార్థన



ఓ బొజ్జగణపయ్య నీబంటునేనయ్య,
ఉండ్రాళ్ళ మీదికి దండు పంపు
కమ్మని నేయైన కరిముద్దపప్పైన
బొజ్జనిండా తిని పొడిచిగెల్లు



వెనకా వెనకా వేముల తోటా,
ఈనకా పండ్లు కాముని రూపులు
ఎత్తని గొడుగులు ఏక వస్త్రములు
చూడీ మడుగు దుప్పటి రేకులు
వాగూనీళ్ళు వనములప్రకృతి
తెల్లని గుళ్ళో నల్లని దేమునికి
నాలుగు చేతుల నమస్కారము



కాళ్ళ గజ్జె కంకాణమ్మ
వేగుచుక్క వెలగా మొగ్గ
మొగ్గ కాదు మోదుగనీరు
నీరు కాదు నిమ్మలబావి
బావి కాదు బచ్చలి కూర
కూర గాదు గుమ్మడి పండు
పండు గాదు పాపడ మీసం
మీసం గాదు మిరియాల పోతు
పోతుగాదు బొమ్మల శెట్టి
శెట్టిగాదు శామల మన్ను
మన్నుగాదు మంచి గంధపు చెక్క
లింగులిటుకు పందెమూల పటుకు
కాలు పండింది కడగా తీసి పెట్టు.

## ఇది ఆడపిల్లల నుద్దేశించినది

చెమ్మ చెక్క చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క రంగు తేయంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు తేయంగ
పగడాల చెమ్మచెక్క పంది రేయంగ
పందిట్లో బాలుడు పరుగు లెత్తంగ
పరుగో పరుగు.

## మగ పిల్లలకు యిలా వుంటుంది

ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా
మినపాపప్పు మెంతిపిండి
తాటి బెల్లం తవ్వెడు నెయ్యి
గుప్పెడు తింటే గుల్లకా లాడి
నడుమూ గట్టీ నా మాట బట్టి



ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా

సన్నా బియ్యం చాయా పప్పు

మినపాపప్పు మెరికా బియ్యం

పాలు నెయ్యోసి పాయసం ఒండూ

నీ మొగుడు దింటే ఆనందమంటే



గొబ్బియళ్ళోయి గొబ్బిళ్ళు

సుబ్బి గొబ్బెమ్మ సుఖమూ లియ్యావే

తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యావే

చేమంతి పూవంటి చెల్లెల్నియ్యావే

అరటి పూవంటి అక్కానివ్వావే

పొన్నా పూవంటి అన్నానివ్వావే

మొగలి పూవంటి మొగుణ్ణివ్వావే
కలువా పూవంటి కూతుర్నివ్వావే
మల్లేపూవంటి మఱదీ నివ్వావే
బంతి పూవంటి బావానివ్వావే
మామిడి పూవంటి మావానివ్వావే
గొబ్బియళోయి గొబ్బిళ్ళు
కొలని దోపరికి గొబ్బిళ్ళో
యదుకులము స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యుల కెల్లను తల
గుండు గుండనికి గొబ్బిళ్ళో
పాప విధుల శిశుపాలుని గొట్టిన
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపున కంసుని యిడుముల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో
దండివైరులను తరిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండి పైడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో

## పిల్లల హాస్యపు పాటలు

కోమటి కోమటి కొయ్య
రొట్టె మీది రొయ్య
నీ అక్క చెవులు గొయ్య
నీ యాలి ముండమొయ్య

## అయ్యవారి గురించి

అయ్యోరియ్యో అంతంత
అయ్యోరి పెండ్లాం ముంతంత
ముంత దీసుకుపోయి మూలకు బెడితే
నక్కెత్తుక పోయెరా నారాయణా
నారాయణ నారాయణ నక్కతోక
నన్నెందు కుంచావు కొంచబోక
పుట్నాల గంపకాడ దించిరాక
మంచినీళ్ళ బావికాడ ముంచిరాక
తమ్ముడు తమ్ముడు తాయెత్తు
తమ్ముడు పెండ్లాం మురికిత్తు
మురికిత్తు దీసుక మూలకు పెడితె
నక్కెత్తుక పోయెరా నారాయణ

## వెక్కిరింతల పాట

బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు బెడ్డముక్క
బ్రాహ్మడి పెళ్లాం సుద్దముక్క
కోమటి కోమటి కొత్త బెల్లం
కొంటావా తింటావా చెప్పు

## గురువుకు పంగనామాలు పెట్టే శిష్యుని పాట

పిడకలూ పుడకలూ అమరంగ బెట్టి
అందులో అయ్యవారిని పండుకో బెట్టి
తాటాకు వెలిగించి తలకింద బెట్టి
అయ్యయ్యో పంతులూ అటుపోయినావా

## అలాగే గుడిలోని పూజారికి

అరటి పళ్లు కొబ్బరికాయ అమ్మవారికి
చేతిలోని చెల్లని కానీ పూజారికి
వడపప్పు చలివిళ్లు అమ్మవారికి
చేతిలోని చెల్లని కానీ పూజారికి
అగరవత్తులు కర్పూరం అమ్మవారికి
చేతిలోని చెల్లని కానీ అయ్యవారికి

## 23

## అత్తగారింటికి వచ్చిన బావను మరదలు ఆట పట్టించు పాట



బావా బావా పన్నీరు
బావను పట్టుకుని తన్నేరు
వీధి వీధి తిప్పేరు
వీశెడు గంధం పూసేరు
చావడి గుంజకు కట్టేరు
చప్పిడి గుద్దులు గుద్దేరు

ఇంకా
పదేళ్ళనాటిదే పాత దూలమ్మ
పటిపోయె మా బావ పల్వారుసమీద
పళ్ళన్ని పిప్పాయె నోరెర్రనాయె
వీధితో బావగారికి విన సిగ్గులాయె

## పదినలను హాస్యమాడుట



పదినా పదినా పల్లంకి పిట్టా
గదిలో పెట్టా గంజినీళ్ళోయ్యా
నీ కొడుకు పుట్టా నాపేరెట్టా
అన్నయ్య కొట్టా నువ్వేడ్వ నేన్నవ్వా

ఇంతా

వదిన వదిన వాసింత
పన్నేండ్ల కడుపంటు
తిరిగి చూస్తే లేడంటు
మళ్ళీ చూస్తే మంచానున్నాడంటు



మా పాప మా మల్లు మత్స్యావతారం
కూర్చున్న తాతల్లు కూర్మావతారం
వరసైన బావల్లు వరహావతారం
నట్టింటు నాయత్త నరసింహావతారం

వాసిగల బొట్టెల్లు వామనావతారం
వర మగురు దేవ మత్స్యావతారం
రక్షించు మామయ్య రామావతారం
బంతైన బంధువులు బలభద్రావతారం
చిట్టి నా కన్నోడ శ్రీకృష్ణావతారం
బుద్ధితో మా చిట్టి బుద్ధావతారం
కలివిడితో మాయన్న కలికావతారం
వర్ధిల్లు పసిపాప వర్ధిల్లు నా తండ్రి

ఇంకా

అమ్మనన్న ముద్దును ఏమన్నారు
అచ్చనాపుల పాలన్నారు
అప్పుడు కాచిన నెయ్యన్నారు
దోరగవేగిన గారన్నారు
పొరిము వచ్చిన అరిశన్నారు
పటిక పంచదార పొడన్నారు
కాయపట్టు రాయని బంగారు కుచ్చు
కాయ నాతో నాడినది సంగాత పడుచు
కాయ మూడవదియమ్మ ముక్కాలిపీట
కాయ నాల్గవదియమ్మ నల్లని పూస
కాయ ఐదవదమ్మ అమ్మనికాయ

కాయ ఏడమ్మ నాకాయ ఎత్తెత్తిపట్టు
ద్వారావతీ యాదవకుల భర్తకు
తాళహస్తములు తప్పక కొట్టుచు
వజ్రపురిని దావలమై చిక్కిన
గోపప్రియునకు గొబ్బిళ్ళనుచు



కన్నవాడ రారా, నన్ను కన్న వాడ రారా
చిన్నారి పొన్నారి చిట్టి రారా
నాకూర్మి పట్టిర నాకుమార రారా
అయ్య రారా నల్లనయ్య రారా
అప్పచ్చి కొండ రామయ్య రారా

అప్ప విందులు చేతురే అనుచు పిల్వ
తల్లి ఉల్లాసముగ అల్లి బిల్లి గొనచు
కాళ్ళ గజ్జలు ఘల్ ఘల్ ఘల్లు మనగ
మురువు చూపెడి యశోద ముద్దుతనయ

వానలు కురవాలి వరిచేలు పండాలి
మాకొట్లు నిండాలి బుడుగో బుడుగో
మా దాసిదంపాలి మాయమ్మ వండాలి
మా బొజ్జనిండాలి బుడుగో బుడుగో

కప్పతల్లి కప్పతల్లి కడవెడే నీళ్ళు
చీమతల్లి చీమతల్లి చిట్టెడే నీళ్ళు
దొంతాక దొంతాక దొడ్డెడే నీళ్ళు

సీతమ్మ వాకిటా చిరుమల్లె చెట్టు
చిరుమల్లె చెట్టేమొ చితక పూసింది
చెట్టు కదలాకుండ కొమ్మవంచండి
కొమ్మ విరగకుండ పూలుగోయండి
అందులో పెద్ద పూలు దండ గుచ్చండి
దాచుకో సీతమ్మ రాముడంపేడు
దొడ్డి గుమ్మంలోన దొంగలున్నారు
దాచుకో సీతమ్మ దాచుకోవమ్మ
ధాచుకో ఖుంఘేను ధోచుకుంటారు



సంజె దీవికి చక్కని జేజే
గుడిదీపానికి గుప్పెడు జేజే
కుందెలదీవికి గొప్పగ జేజే
పళ్ళెర హారతికి పట్టెడు జేజే
మంగళ హారతికి మక్కువ జేజే
రామారతులకు రంగుగ జేజే
కప్పుర దేవికి కందువ జేజే
బాలదృష్టి పాళము జేజే
వేగి వెల్లునకు సాగిలి జేజే
గురుస్వాములకు గుర్తుగ జేజే
చిట్టిపాపల చిరుహస్తాల
దేవుని కెత్తాలె దీపన జోత



దాదం దక్కచ్చి రాదారక్కమ్మ
చింతలెక్కి పడ్డాది ఉట్టి మీద బెల్లం
పొట్టికాకరకాయ రాజుగారి దొడ్లో
పాలో స్తావా పెరు గోస్తావా

చల్లా చెయ్యి గొల్లభామ
సందిట దండలు కదిలేనూ
గోవుల కాయవె గొల్లభామ
గుజ్జెన కాళ్ళు కదిలేనూ
పాలు పిండవె గొల్లభామ
పట్టెడు గుత్తులు కదిలేను



గుమ్మాడమ్మా గుమ్మాడి
తీగపాకింది గుమ్మాడి
పందిరెక్కింది గుమ్మాడి
మొగ్గ తొడిగింది గుమ్మాడి
పువ్వు పూసింది గుమ్మాడి
కాయకాసింది గుమ్మాడి
పండు పండింది గుమ్మాడి
పంచిపెట్టిరి గుమ్మాడి

కస్తూరి రంగ రంగా మాయన్న
కావేటి రంగ రంగా
శ్రీరంగ రంగ రంగా నినుబాసి
నేనెట్లు మరచుందురా

# లాలిపాట



జో అచ్యుతానంద జోజోముకుందా
లాలిపరమానంద రామగోవిందా జో... జో...
తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి
నాలుగు వేదములు గొలుసులమరించి
బరువైన ఫణిరాజు పాన్పు సమరించి
చిత్తము అనియేటి దూలములు వేసి లా...లీ...

కామక్రోధములను తొట్టె నమరించి
సహస్రమని యేటి పక్కగావించి
భక్తిచేతను పట్టుపానుపమరించి జో... జో...

ఓంకారమనియేటి ఒక తొట్టిలోనూ
తత్వమసి అనియేటి పలువలం బరచి
వేడ్కతో పాపని ఏర్పాటు చేసి
ఏడు భవనములవారు ఏకమై పాడా జో... జో...

జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలిపరమానంద రామ గోవిందా జో... జో...



కొండ మీద వెండిగిన్నె
కొక్కెరాజు కాలు విరిగె దానికేమ్మందూ,
వేపాకు చేదు, వెల్లుల్లి గడ్డ
నూనమ్మ బొడ్డు నూటొక్కధార

## రకరకాల పాటలు

కుండ నిండ కందులూ రంగసాని బొందులూ
బొందులూ బొందులూ బొందులూ
చెన్నపట్నం చెఱుకు ముక్క
నీకో ముక్కా. నాకో ముక్కా
భీముని పట్నం బిందెల జోడూ
నీకో బిందె నాకో బిందె
ఇరుకు చింతకాయ
కొరుకుతె వంకాయ
కలబో సొండితె
కాకరకాయ.        కాయ, కాయ.
ఇంతింత గుడి కాదు ఈశ్వరుని గుడికాదు
కంచు కొప్పెర కాదు, కదిలించగారాదు (ఆకాశము)

## పొడుపు కథల పాటలు

గోడ మీది బొమ్మ గొలుసుల బొమ్మ
వచ్చిపోయే వాళ్ళకు వడ్డించు బొమ్మ (తేలు)

అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది
మా ఇంటి కొచ్చింది తైతక్కలాడింది (కవ్వం)

నూతిలోని పాము నున్నని పాము
చారచారల పాము చక్కని పాము (పొట్లకాయ)

ముక్కు మీది కెక్కు రెండు చెవులు నొక్కు
టక్కు నిక్కుల సొక్కు జారిందంటే పటుక్కు
(కండ్లజోడు)

పచ్చని పెట్టెలో విచ్చుకొంటుంది
తెచ్చుకో బోతేను గుచ్చుకుంటుంది
ఎంత గుచ్చుకున్న ఏమైన గానీ
తెచ్చుకోక మానం మెచ్చుకోక మానం (మొగలిపువ్వు)

వస్తాడు, వరుస్తాడు
పిసుకుతాడు పెడతాడు (గాజులు)

గుడి నిండా నీళ్ళు
గుడికి తాళం (కొబ్బరికాయ)

ఆకాశాన అరవై ఆరు కొడవళ్ళు
ఎక్కితేనేగానీ కొయ్యడానికి రావు
కోస్తేనేగానీ తింటానికి రావు (చింతకాయలు)

# సరసపు పాటలు

ఒకరిని కిందెట్టి ఒకరిని పైనబెట్టి
ఒకరిని చూసుకుంటు కూర్చున్నానోయ్ మావా
ఎవరిని కిందెట్టి ఇంకెవరినీ పైనబెట్టి
ఎవరిని చూసుకుంటు కూర్చున్నావే భామా
కాటుక కిందెట్టి బొట్టూను పైనబెట్టి
అద్దంలో చూసుకుంటూ కూర్చునోన్ననాయ్ మామా
ఒకరికి చేతులిచ్చి ఇంకొకరికి కాళ్ళనిచ్చి
ఒకరికి నడుమూనిచ్చి కూర్చున్నానోయ్ మామా
ఎవరికి చేతులిచ్చి ఇంకెవరికి కాళ్ళనిచ్చి
ఎవరికి నడుమూనిచ్చి కూర్చున్నావేభామా
గాజులకు చేతులిచ్చి కడియాలకు కాళ్ళనిచ్చి
నడుముకు వడ్డాణంపెట్టి కూర్చున్నానోయ్ మామా
ఒకరిని చితకాకొట్టి ఇంకొకరిని చుట్టాచుట్టి
ఒకరికై నేనెదురు చూస్తున్నానోయ్ మావా
ఎవరిని చితకాకొట్టి ఇంకెవరిని చుట్టాచుట్టి
ఎవరికై ఎదురూ చూస్తున్నావే భామా
వక్కనూ చితకా కొట్టి ఆకులను చుట్టాచుట్టి
నీ కొరకే ఎదురూ చూస్తున్నానోయ్ మామా

పండుగలన్నీ పిల్లలకే అయినా దీపావళి, దసరా, పిల్లల కిచ్చిన ఆనందం మరో పండుగ యివ్వదు. దసరా పండుగలలో అయ్యవారు పిల్లలను వెంట బెట్టుకొని అన్ని కులాల పెద్ద వారిండ్లకు వెళ్ళి,

అయ్యవారికి చాలు ఐదు వరహాలు
పిల్ల వాండ్లకు చాలు పప్పుబెల్లాలు
రేపురా మాపురా మళ్ళిరమ్మనక
అటుపోయి రమ్మనక ఆగి రమ్మనక
బాలకుల దీవెనలు బ్రహ్మదీవెనలనుచు_



శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
ఆరోగ్యమస్తు మీకైశ్వర్యమస్తు
జయవిజయీభవ దిగ్విజయీభవ
శ్రీహరి కరుణా కటాక్ష, వీక్షణాలంకార

అని రాజులింటికి వెళ్ళినపుడు
ఎల్ల శేనుగు నెక్కి
ఏలితివి జగము అనియు

ధనవంతులైన కోమటీండ్లకు వెళ్ళి
కోటికి పడగెత్తి, కోమట్లలోను అనీ

బ్రాహ్మణుల వద్దకు వెళ్ళ
దేవతల వంటి భూసురులు మీరు
అని పాటలు పాడి, పప్పు బెల్లాలతో సరిపెట్టుకుని
అయ్యవార్లకు దసరా మామూళ్ళు యిప్పించేవారు



హాయి, హాయి ఆపదల కాయి

చిన్నవాడ కాయి శ్రీరంగదేవా

చిగురుల ఊయలలో చిలకా ఊగేవు

గగనాలెన్నెన్నో గడచితివేమో

ఆపదలకాయి శ్రీ వేంకటేశా

కలలను దాచాలి కనులను మూసి

నిద్దుర, కిదే వేళ చిన్న నా తండ్రీ

హాయి, హాయి ఆపదలకాయి



